గౌడపదం మహాన్తం గోవిందయోగీన్ద్రమథాస్య శిష్యమ్ । శ్రీశంకరాచార్యమథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యమ్ । తం తోటకం వార్తికకారమన్యానస్మద్గురూ న్సంతతమానతోస్మి ।

ఇట్టి పవిత్రమైన సంప్రదాయము ప్రకృతము. శ్రీవిద్యాశంకరపదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానన్దభారతీమాన్తాచార్య మహాస్వామి వారియందు సుస్థిరమైయున్నది. కలిద్వాపరసంధిలో శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసులు భారతీవంశ వివర్ధనుడైనాడు. విద్యావంశ గౌరవాభిలాష కలవారందరూ ఈ విషయమును స్మరించాలి.

**గురులక్షణం :** అనేక గుణములతో కూడిన వాడు గురువు. అత్యుత్కృష్టుడు. శుద్ధ-వేషుడు, మనోహరుడు, సర్వాంగమార్గతత్త్వజ్ఞుడు, సర్వమంత్రవిధానము లెరిగిన వాడు, ఇంగితాకారచేష్టలను గుర్తించువాడు, దుర్జనులను దూరమున నుంచువాడు, అంతర్ముఖుడు, బహిర్ముఖదృష్టిలేనివాడు, సర్వజ్ఞుడు, దేశకాలవిదుడు, దయాసహితుడు, శాంతుడు, వేదవేదాంగవిదుడు, నిత్యనైమిత్తికములలో అనిందిత కామ్యముతో ప్రవర్తించువాడు, అలోలుపుడు ఇట్టి లక్షణములు కలవాడు గురువౌతాడని, మేరుతంత్రము చెప్పినది. శ్రీవిద్యాదర్శనము కూడ ఈ విశేషమునే నిరూపించినది.

ఉత్తమగురువు 5 విధములు బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, భిక్షుకుడు, అతివర్ణాశ్రమి. వీరిలో ఉత్తరోత్తరులు శ్రేష్ఠులని సూతసంహిత చెప్పుచున్నది.

**విద్యాస్థానములు :** శ్రీవిద్యాధికారం గల బ్రాహ్మణులకు అంతఃకరణపరిపాకం వల్ల సోపానక్రమంగా నాల్గు విద్యాస్థానములున్నవి. మొదట **తల్లికి జన్మించుట**, రెండవది **మౌంజీబంధనము**, మూడవది **యజ్ఞదీక్ష**. నాల్గవది **న్యాసకర్మ**. ఇవి జన్మాంత-రార్జితములైన పుణ్యకర్మ వశమున కల్గును. గీతాగ్రంథములో కల్యాణకర్మ నాచరించినవాడు ఎన్నడూ దుర్గతి పొందడని, పుణ్యమొనరించిన లోకములో చిరకాలముండి, యోగభ్రష్టుడై శ్రీమంతుల గృహములోకాని, మహనీయులగు ధీమంతులైన యోగులకులమున కాని జన్మిస్తాడు అని చెప్పబడినది. "**రమణీయ చరణాః రమణీయాం యోనిమాపద్యేరన్**" – ఛా – 5.10.7.

పైన చెప్పిన రెండవ విద్యాస్థానము (ఉపనయనము) పితృధీనము. "**అష్టవర్షం బ్రాహ్మణముపనయీత తం అధ్యాపయీత**" అని స్మృతి చెప్పుచున్నది.

మూడవ, నాల్గవ విద్యాస్థానములు ఐచ్ఛికములు, స్వాయత్తములు. అచార్యా-నుగ్రహమువల్లనే సంపాదించగలరు. సాధకుడు విద్యాధికారయోగ్యత సంపాదించి గుర్వనుగ్రహానికై యత్నించాలి.

**శిష్యలక్షణం :** సాధకుడైన శిష్యుని లక్షణం మేరుతంత్రం ఈ విధంగా చెప్పినది. గురువాక్యప్రమాణజ్ఞుడు కావాలి. గురుశుశ్రూషణాశక్తిగలవాడు కావాలి. అభిమాన గర్వాదులు లేకుండవలెను. నిరపేక్షుడై వర్తించాలి. గురుప్రసాదము కాంక్షించాలి. జపధ్యాననిరతుడు మోక్షమార్గాభిమాని, సమాధిసాధనముకలవాడు, సదాచారుడు శ్రద్ధాభక్తులు కలవాడు, సాధుజనసమ్మతుడు, అనుకూలక్రియాయుక్తుడు, సర్వోప-కారకుడు, అయినవానినే దైవతతుష్టికై శిష్యునిగా స్వీకరించాలి. శ్రీవిద్యాదర్శనం కూడ ఈ విధంగానే చెప్పినది.

**గురుశుశ్రూష :** ఇట్టి లక్షణాలు గల సాధకుడు తన అభిలాషసిద్ధికై లక్షణసంపన్నుడైన గురువు నాశ్రయించవలెను. "**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా**" భ - 4.3.4 నమస్కరించి తత్త్వము తెలిసికొమ్మని గీత అంటున్నది.

"గురుశుశ్రూషయా విద్యా, పుష్కలేన ధనేన వా
అథవా విద్యయా విద్యాచతుర్థం నోపలభ్యతే ॥

ఈ విధంగా విద్యాసాధనాలలో 3 సాధనములు ప్రసిద్ధంగా యుండగా గీతాచార్యుడు విద్యా సాధనంలో శుశ్రూషను మాత్రమే చెప్పినారేమి. అనగా శ్రీవిద్యా సమానమైన విద్య ఎక్కడాలేదు. ఇతర విద్యలతో శ్రీవిద్య గ్రహించుటకు వీలుకాదు. ఈ విషయము "**నిత్యాషోడశికార్ణవ**" గ్రంథములో బాగా నిరూపితమైనది.

వలకు మూలపుముడిలో దారములన్నీ కూడియున్నట్లు సర్వమంత్రములు ఈవిద్యలో కూడియున్నవి. మహామంత్రములన్నీ బీజరూపములో యున్నవి. కాన ఇది శ్రేష్ఠతరవిద్య, కోటిజన్మలలో అన్యదేవతాకీర్తనచేస్తే, చివరి జన్మలో శ్రీదేవీ నామకీర్తనాధికారి అవుతాడని, శ్రీవిద్యోపాసకుడౌతాడనిన్నీ మార్కండేయపురాణము నిరూపించినది. తరువాత జన్మలేనివారికే **శ్రీమత్పంచదశాక్షరీ** లభిస్తుంది. అది మోక్షహేతువు.

శ్రీవిద్యా విషయములో పుష్కలధనప్రదానమన్నది కుదరదు. సర్వలోకములు శ్రీవిద్యా మంత్రమునకు ఏ అంశమునకునూ పోలవు. గురువునకు దక్షిణ ఇవ్వవలెను. సర్వస్వం ఇవ్వాలి. తదర్ధమైనా ఇవ్వాలి, అనియున్నది. గాన స్వశక్త్యానుసారంగా ఇస్తే శిష్యభక్తి విశేషము సూచిస్తుంది. అంతేకాని శ్రీవిద్యకు మార్పిడి గానేరదు. శ్రీవిద్యాతుల్యమైన ధనమెక్కడనూ లేదు. శిష్యుడిచ్చిన ధనము కొద్దిలో నశిస్తుంది. గురువిచ్చిన విద్య ఇహపరలోకాల్లో సర్వకాలసర్వావస్థలలో సుస్థిరముగా యుంటుంది. కాన శ్రద్ధాభక్తి-పురస్సరమైన శుశ్రూషయే గుర్వనుగ్రహమునకు ముఖ్యకారణము అని భగవాను డుపదేశించాడు. "**తద్విద్ధి ప్రణిపాతేన**"

విద్యాభిలాషి శుశ్రూషలో ప్రమాదపడరాదు. విద్యాసంగ్రహ ఉపాయమే గురు శుశ్రూష అనుకోరాదు. విద్యాఫలప్రాప్తిగూడ గుర్వధీనము. “యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః । యథా దేవే తథా మన్త్రే యథా మన్త్రే తథా గురౌ । యథా గురౌ తథా స్వాత్మన్యేవం భక్తిక్రమః ప్రియే ” పరశివుడు స్వయంగా మానవదేహాన్ని ధరించి యోగ్యశిష్యానుగ్రహానికై భూమిలో సంచరిస్తాడు. మూడు నేత్రాలు లేని శివుడు, నాల్గుచేతులు లేని విష్ణువు, నాల్గుముఖములు లేని బ్రహ్మయే గురువు అన్నారు. ఘటము, కలశము, కుంభము అను పదములు ఒకే అర్థమును చెప్పినట్లే దేవుడు, మంత్రము, గురువు అను పదములున్నూ ఒకే అర్థమును తెల్పును. గురుభక్తిరహితునకు తపోవిద్యాకుల–వ్రతములేవీ యుండవు. గురువునందు భక్తియే ప్రధానము, వేరొక మార్గము లేదు. గురువుయందు మనుష్యబుద్ధి, మంత్రమునందు అక్షరబుద్ధి, ప్రతిమలలో శిలాబుద్ధి, నరకమును కలిగించును. గురువును మానవుడనుకోరాదు. వానికి సిద్ధికల్గదు. “**శివే రుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే న కశ్చన** ” విద్యాఫలప్రాప్తి గుర్వధీనము. కాన గుర్వనుగ్రహ సంపాదనమునకై గురుభక్తి కల్గి యుండవలెను.

**గుర్వన్వేషణ :** విద్యాసంగ్రహమునకై సద్గురు నన్వేషింపవలెను. అసద్గురువునకు అధీనుడు కారాదు. దాంభికులు స్వార్థాభిలాషులు ఆచార్యవేషంతో యుంటారు. ప్రతిగృహములో దీపమువలె గురువు ఉంటారు. సూర్యునివలె సర్వదీపకుడు దుర్లభుడు, పరతత్త్వము తెలిసినవాడు దుర్లభుడు. శిష్యవిత్తోపహారకు లనేకులున్నారు. దుఃఖాప హారకులు దుర్లభులు.

స్త్రీలకు, శూద్రులకు గురుత్వములేదు. వైశ్యునకు, క్షత్రియునకు విద్యోత్కర్ష ననుసరించి గురుత్వముండును. గుర్వన్వేషణలేక విద్యారంభము చేయరాదు. ఆకస్మికముగా మంత్రమును వినిగాని, పుస్తకమును చూచి కపటంగా మంత్రమును తెలిసికొనిగాని జపిస్తే అనర్థం కల్గుతుంది. అవిచ్ఛిన్నపారంపర్యంకల సద్గురు వుపదేశించిన మంత్రమునే అనుష్ఠించాలి. న్యాయలబ్ధమైన మంత్రము పారంపర్య క్రమములో లభిస్తే సిద్ధికలుగుతుంది. దీక్షారహితునకు సిద్ధిలేదు. అందుచే సద్గుర్వన్వేషణము సర్వథా కర్తవ్యము.

**దీక్ష :** దీక్ష విద్యాధికారయోగ్యత నిస్తుంది. సాధకుల అంతఃకరణపరిపాకవశమున మంద, మధ్యమ, ఉత్తమ భేదముతో 3 విధాలుగా యుంటుంది. తాను గ్రహించిన విద్యామంత్రానుష్ఠానయోగ్యతనిచ్చునది మందదీక్ష. ఆమ్నాయ పంచక అనుష్ఠాన

యోగ్యతనిచ్చేది మధ్యమ దీక్ష, ప్రణవము మినహా సకలవిద్యానుష్ఠానయోగ్యతనిచ్చేది ఉత్తమదీక్ష. ఉత్తమదీక్షకే పూర్ణదీక్ష అని పేరు. దీనిలోనే పూర్ణాభిషేకముంటుంది. ఇదిలేక పూర్ణాభిషేకము లభించదు. ఈ దీక్ష బహువిధములు, **ఉపనయనదీక్షా, వివాహదీక్షా, యజ్ఞదీక్షా, సంన్యాసదీక్షా** అని. యజ్ఞమనేదికర్మ. యజ్ఞము, జపయజ్ఞము. ఈ దీక్షాప్రకరణములో జపయజ్ఞమని గ్రహించవలెను. ఇది భగవత్స్వరూపము.

"**యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి**" భ - 10.25 అని గీత చెప్పినది. ప్రణవాధికారము నాల్గవదీక్ష అయిన సంన్యాస దీక్షలోనే లభిస్తుంది. ఈ దీక్షా ప్రక్రియ రేణుకాతంత్రములోనున్నది. భారతీ సాంప్రదాయ యతులు యతులందరకు గురువులు. వారలకు సర్వమంత్ర జపము యుంటుంది.

భారతీ యతులు బాలాది పాదుకాంత మంత్రములు నిత్యము జపము చేయవలెను. ఇతర యతులు ప్రణవజపము మాత్రమే చేయవలెను. అన్ని మంత్రములను అనుష్ఠింపరాదు.

**భారతీయతయస్సర్వే యతీనాం గురవస్స్మృతాః ।**
**బాలాది పాదుకాన్తానాం మన్త్రాణాముత్తమం జపమ్ ।**
**భారతీయతిభిః కార్యం నిత్యమేవ న సంశయః ।**
**ఓంకారజపమాత్రం త్వన్యేషాం తు విధీయతే ॥**

**విద్యాధికార యోగ్యత, దీక్షాప్రయోజనము**

"**దేవో భూత్వా దేవాన్ యజేత**" "**నాఽరుద్రో రుద్రమర్చయేత్**" ఈ విధినిషేధములు ఏ దేవతాభావము పొందినవానికే ఆ దేవతావిద్యాధికారయోగ్యత కల్గునని చెప్పుచున్నవి.

దీక్షాప్రకారము లనేకములున్నప్పటికీ శక్తిపాతక్రియ యుండాలి. హస్తమస్తక సంయోగాదులచే అది కల్గును. శక్తిపాతముచే మనోవాక్కాయములు సంస్కృతము లౌతవి. శాక్తదీక్ష, శాంభవదీక్ష, మంత్రదీక్ష మూడు విధములు. శక్తిప్రవేశంవల్ల శాక్తదీక్ష కలుగుతుంది. చరణవిన్యాసము వల్ల శాంభవదీక్ష కలుగును. మంత్రోపదేశముచే మంత్రదీక్ష కల్గును. అభిషేకముచే దేహము, కలాగ్రహణముచే అంతఃకరణము, మంత్రోచ్చారణచే వాక్కు పవిత్రములౌతవి. దీక్షావిధిలో గురువు, శిష్యునందు దేవతా ప్రతిష్ఠ చేయును. "**చక్రే దేవ్యాం తథా శిష్యే ప్రతిష్ఠా త్రివిధా ఉచ్యతే** " తత్త్వము తెలిసిన గురువే దేవతా ప్రతిష్ఠాధికారి.

**కర్తృలక్షణము :** "**ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తా**" అని కాఠకశ్రుతి - 1.3.4

చెప్పుచున్నది. ఇట్లు దీక్షితులైనవారికే తంత్రారంభములో అధికారము. ఉపనయనము లేని బ్రాహ్మణులకు కర్మాధ్యయనములలో అధికారములేనట్లు, అదీక్షితునకు మంత్రదేవతార్చనములలో అధికారములేదు.

**"దీయతే జ్ఞానవిజ్ఞానం, క్షీయన్తే పాపరాశయః ।**
**తేన దీక్షా ఇతి ప్రోక్తా ప్రాప్తాచేత్ సద్గురోర్ముఖాత్ ॥ "**

గుర్వనుజ్ఞలేక లోభమువలన మంత్రానుష్ఠాన మొనరింపరాదు. ద్విజులకు ఆచార్యానుగ్రహము యోగ్యతా హేతువు, దీక్షను ఆపేక్షించిన శిష్యుని ఆచార్యుడు పరీక్షించి దీక్షనీయవలెను. లోభాదులచే దీక్షనిస్తే దేవతాశాపము కలుగును. ఉపదేశ సంప్రాప్తమైన విద్యను, పరశిష్యులకివ్వరాదు. పరీక్షితుల కివ్వవలెను.

**"విద్యా హ వై బ్రాహ్మణమాజగామ, గోపాయ మాం శేవధిష్టేఽహమస్మి"**
– ముక్తి కో. 151.

విద్య బ్రాహ్మణునిచేరి "నన్ను భద్రపరచుము. నీకు మహానిధిని, ఉత్తమస్త్రీనివలె నన్ను రక్షింపుము." అనినదని **ముక్తికోపనిషద్** గ్రంథములో నున్నది. నియమముగా ప్రవర్తించు వానికి "విద్య" కామధేనువు. కావున యోగ్యతగల శిష్యుని స్వీకరింపవలెను.

**గురుదక్షిణ :** శిష్యుడు యథాశక్తిగా గురుదక్షిణ నర్పింపవలెను. కాకపోయినచో గురుభక్తి సంక్రమించదు. శివాత్మకుడైన గురువునకు సర్వస్వము, తదర్ధము, తదర్ధము నర్పింపవలెను. సువర్ణము, భూషణము, వస్త్రము, భవనము, గురువు లభిలషించినది తన శక్త్యనుసారముగ భక్తితో నర్పింపవలెను.

**స్త్రీలకును అధికారము :** ఆగమములు చెప్పిన విధంగా స్త్రీలు, శూద్రులు పూజ చేయవలెను. విధవస్త్రీలు పుత్రుని ఆదేశానుసారము, కన్యలు తండ్రి ఆజ్ఞ ప్రకారము, భార్య భర్త ఆజ్ఞానుసారము పూజలు చేయవలెను.

**తంత్ర స్వరూపము :** తంత్రము మూడు విధములు. **నిత్యము, నైమిత్తికము, కామ్యము.** నిత్యము రెండు విధములు. ప్రధానము, అంగము. తంత్రమునకు గాయత్రీ దేవత ప్రధానము. ఆ గాయత్రి ప్రకటగాయత్రి. గుప్తగాయత్రి అని రెండు విధములు. ప్రకటగాయత్రి 24 అక్షరములతో నున్నదని సుప్రసిద్ధము. శ్రౌతస్మార్తాది సకల విద్యాగ్రహణ అధికారమునకు హేతువు. ద్విజత్వము కల్గించునది. తగిన వయస్సులో గాయత్రిని ఉపదేశింపవలెను. లేనిచో వ్రాత్యత కల్గును. గుప్తగాయత్రి ఉపనీతుడు అభిలాషపూర్వకముగా అన్వేషింపవలెను. అంతవరకు ఇది గుప్తమే. గుప్తగాయత్రి 3

విధములు. త్ర్యక్షరీ మందదీక్షా విషయము. **పంచదశాక్షరీ** మధ్యమదీక్షా విషయము. **షోడశాక్షరీ** ఉత్తమదీక్షా విషయము. ఉత్తమదీక్షయే పూర్ణదీక్ష. పూర్ణదీక్షితుడే పూర్ణాధికారి. ప్రకటగాయత్రియొక్క 4వ పాదము ననుష్ఠించుటకు అతడే అధికారి.

అంగవిద్యలు నాలుగు. గాణపత్యము, శైవము, వైష్ణవము, సౌరము. గణపతి చతుర్వింశత్యక్షరి, శివమంత్రము షడక్షరి, వైష్ణవము అష్టాక్షరి, సౌరమంత్రము అష్టాక్షరి, ఇతరములన్నీ గౌణములు, అప్రధానములు, అంగసహితమైన ప్రధానమును పంచాయతన మందురు. **పంచాయతనవిద్యయే** “శ్రీవిద్య”. గుప్తవిద్యాధికార తారతమ్యమున శ్రీవిద్యాధికారులలో మంద, మధ్యమ, ఉత్తమ భేదము కల్గును.

**పంచాయతన ఉపాసనాఫలం** :

గణేశపూజ విఘ్నములను పోగొట్టును. ఆరోగ్యము కొఱకు సూర్యుని పూజింప వలెను. ధర్మమోక్షములకై శివుని ఆరాధింపవలెను. ధర్మార్థకామమోక్షములకై చండిక నారాధింపవలెను.

పర్వాదికాలభేదమున చేయునది నైమిత్తిక పూజ. కామ్యము ఐచ్ఛికము; అభ్యుదయ హేతువు. శాంతికపౌష్టిక హేతువు.

నిత్యము మఱల రెండు విధములు. సాధారణము, అసాధారణము. అసాధారణము గురువు సన్నిధిలో దీక్షాలబ్ధము. మనుస్మృత్యాదులచే ఉపదేశింపబడినది సాధారణము. ఈ సాధారణ అసాధారణ తంత్రము బ్రాహ్మీముహూర్తములో నిద్రలేచినది మొదలు మరల నిద్రించు కాలమైన రాత్రి రెండవ ఝామము వరకు వ్యాపించి యుండును. దీక్షితుడు మనోవాక్కాయములచే స్మరించిన, పలికిన, ఆచరించినది అంతయు తంత్రమగును. “ప్రాతస్సముత్థాయ తవ ప్రియార్థం సంసారయాత్రామనువర్తయామి” అని ప్రారంభించి “ప్రాణబుద్ధిదేహధర్మాధికారపర్యన్తజాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాసు యచ్చ స్మృతం యదుక్తం యచ్చ కృతం బ్రహ్మార్పణం భవేత్” అని పలుకవలెనని సంప్రదాయ విదులందురు.

**తంత్రము :** సాధకుడు గురువునుండి తంత్రము స్వీకరించి నిత్యము ఆచరించవలెను. బ్రాహ్మీముహూర్తములో లేచుట, ఇష్టదేవతా స్మరణము, ప్రక్షాళనము, వస్త్రధారణము, ఆచమనము ఆచరించి బ్రహ్మరంధ్రమందు గురువును ధ్యానించి మానసోపచారములచే పూజింపవలెను. తానాచరించునది సర్వము గురువునకు నివేదించి గురు, మంత్ర, దేవతాఽత్మల, ఐక్యము ధ్యానించి, అజపామంత్రము అనుసరించునది. దేవీప్రార్థన,

భూప్రార్థనము అయిన పిమ్మట శ్వాసయుక్తమైన పాదమును భూమిపై నుంచి నైఋతీ దిశకుగాని, దక్షిణదిశకుగాని వెడలి మలచ్యుతి గావించవలెను. ఆ కాలమందు యజ్ఞోపవీతమును అపవిత్రము కాకుండుటకు దక్షిణకర్ణమందుంచవలెను. దక్షిణకర్ణము బ్రహ్మోపదేశము పొందినది గావున ఎప్పుడూ శుచియే. తర్వాత మృత్తికచే జలముచే ఒక పర్యాయము లింగమును, సప్తవారములు గుదస్థానమును, ఎడమచేతిని 10 సార్లున్నూ మార్జనము చేసుకొని పన్నెండు పుక్కిలింతలచే శుద్ధి సాధింపవలెను. ఆచమించవలెను.

తదనంతరము చేదు, కారము, సుగన్ధి అయిన మామిడి, ఉత్తరేణు, నేరేడు, అశోక కాష్ఠముతో ఉత్తరాభిముఖుడుగా అరుణోదయాత్పూర్వమే, దంతధావనము చేయవలెను. తర్వాత తీర్థస్నానముగాని, గృహస్నానముగాని చేయవలెను. స్నానము సప్తవిధములు. వారుణము జలములో మునుగుట, భస్మధారణము ఆగ్నేయము, గోపాదధూళితో చేయునది వాయువ్యము. మంత్రముతో చేయునది బ్రాహ్మము. ఆర్ద్రవస్త్రముతో తుడుచుకొనుట కౌపిలము. అవ్యయానందచిత్స్వరూప విష్ణుచింతనము మానసము. సూర్యరశ్మిలో నుండుట దివ్యము. సముద్రసంగమమందు కాసార, తటాక, నదీ నదములందు చేయునది తీర్థస్నానము. ఇది మహాపాతకనాశనము. బావివద్ద స్నానము గృహస్నానము. అది అప్పుడే ఉద్ధరింపబడిన శీతోదకముచేగాని, ఉష్ణోదకముచే గాని చేయవలెను. పర్యుషితోదకముతో కూడదు. అఘమర్షణ మంత్రములతో మౌనముగా స్నానము చేయవలెను. "**మౌనాభావే స్నానం హరతి తేజః**"

తర్వాత ధౌతవస్త్రద్వయము ధరించవలెను. "రక్తం, నీలం, మలినం, దశాహీనం చ వర్జయేత్".

**తిలకధారణము : "ఫాలే విభూతిమాన్యో౽సౌ బ్రహ్మవిష్ణుశివాత్మకః, భూతిదా తు విభూతిస్స్యాద్విధినా విధృతా యది**". మేరుతన్త్రే – 5.99. త్రిపుండ్రధారణచే జపహోమ వైశ్వదేవ దాన దేవార్చన, శ్రాద్ధములు అక్షయములగును. గోపీచందనధారణము సూర్యరూపమును కల్గించును. దేవతాప్రతిమ నిర్మాల్య కుంకుమ చందన ధారణము ముక్తిని కల్గించును.

**పవిత్రధారణము : "కుశా దహన్తి పాపాన్యనలస్తూలరాశిమివ కుశపూతం తోయం పిబేత్కుశపూతముపస్పృశేత్**" కుశలతో చేసిన దేవ పవిత్రమును ధరించిన పాపనాశనమగును. "పవిత్రం హిరణ్యం పవిత్రం వై దర్భాః" తస్మాత్సువర్ణం ధార్యం"

అందుచే బంగారు ఉంగరమునుగాని, పవిత్రమునుగాని ధరించి సర్వకర్మల నాచరించవలెను. తర్వాత స్వశాఖా నియమానుసారము సంధ్యోపాసన చేయవలెను. సూర్యునకు అర్ఘ్యమిచ్చి తన గృహమున కేగి నిత్యహోమము, నిత్యతర్పణము నాచరించవలెను. పూజాసంభారమును స్వీకరించి యాగమందిరమునకేగి గురువు చెప్పిన విధమున పంచాయతనమును పూజింపవలెను. భోజనానంతరము తాంబూలము భక్షింపవలెను. "**దివా స్వాపనం, మైథునం న కుర్వీత**" ఇక సాయం పర్యన్తము సిద్ధాన్తచింతన మొనరించి సంధ్య, హోమము, దేవార్చనము, భోజనము ముగించి పుష్పానులేపనము నొనరించి శుద్ధశయ్యపై శయనింపవలెను. సమయముచూచి భార్యా సపర్య చేయునది. నిషిద్ధదినములలో వర్జింపవలెను. ఆహార నిద్రాభయమైథునములు జీవులందరకు సమానమైనప్పటికిన్నీ మంత్రసంస్కృతములైన క్రియలను ఆచరింపగా పశుభావము తొలగిపోయి దేవతాభావము లభించును.

**సద్గురువు :** "గు" అంధకారము, "రు" నిరోధకము. గురువు అంధకారమును నశింప చేయును. సద్గురు పదములోని అక్షరములన్నిటికి భావ విశేషమున్నది. రుద్రాది దేవరూపుడుగాన గురువు గురువగును. గురువునుండి దీక్ష స్వీకరింపవలెను. దీక్ష భవబంధ నాశకము. ఇది **ఉపనయనదీక్ష. వివాహదీక్ష, యజ్ఞదీక్ష, సంన్యాసదీక్ష** అను భేదములతో నున్నది. 1. ఉపనయనదీక్ష ద్విజత్వమును ఇచ్చును. దీక్షిత వటువు విద్యాధికారి యగును. 2. వివాహదీక్షవలన దీక్షిత కన్య కర్మాధికారము కలదియగును. 3. యజ్ఞదీక్షలో యాగాధికారముల గల్గును. సంన్యాసదీక్ష జ్ఞాననిష్ఠ నిచ్చును. దీక్ష ఆవశ్యకము. దీక్ష లేకున్న మంత్రములు నిష్ఫలములు. 4. సమయదీక్ష. సమయపాదుక ఆవశ్యకము. స్పర్శదీక్ష, దృగ్దీక్ష, మానసదీక్ష, క్రియాదీక్ష అను భేదములు కలవు. క్రియావర్ణకలాస్పర్శవాగ్దృఙ్మానస దీక్షలు మోక్షప్రదములు. వేధకదీక్ష, పూర్ణదీక్ష, నిర్వాణదీక్ష, సమయదీక్ష ఇట్లు దీక్షాభేదములు కలవు. క్రియాదీక్షచే దేహశుద్ధి కల్గును. వర్ణదీక్షచే దేవభావము కల్గును. కలాదీక్షచే దివ్యభావము కల్గును. గురువు చూడగ, భాషింపగ, స్పృశింపగ, శాంభవదీక్ష లభించును. విధికృతమైన దీక్ష పాపముల దహించును. అదీక్షితులకు జప పూజాదికములు లభింపవు.

**సాధకుడు :** సారసంగ్రహమొనరించి, ధర్మమార్గమున ప్రవర్తించి, కర్ణములను (ఇంద్రియములను) నియమించువాడు సాధకుడు. సాధకుడు గురుసకాశమున తంత్రము తెలియవలెను. ప్రతిదినము కర్మల నాచరింపవలెను. శాస్త్రానుసారముగ ప్రవర్తింపవలెను.

ఉషఃకాలమున లేచి, ఇష్టదేవతాధ్యానము చేయవలెను. దేవత అనగా భక్తుల దేహముల ననుసరించి యుండునది. వరముల నిచ్చునది, తాపత్రయమును నశింపచేయునది. నిద్రలేచిన వానికి ప్రాతఃస్మరణము. యథావిధి దేవతాభేదముండును. **శ్రీవిద్యోపాసకునకు పరదేవతాస్మరణమే ఇష్టదేవతాస్మరణము.**

ఉదఙ్ముఖుడై ఆచమన మొనరించి శుద్ధదేహుడగును. సహస్రార మనదగు బ్రహ్మరంధ్రమందు గురుస్థానము సంకేతితము. అచట పాదుకా ధ్యానము ఒనరించవలెను. పాదుక అనగా పాలనమొనరించునది. దురితము ఛేదించునది. కామితార్థమిచ్చునది. మానసోపచార మొనరించి **త్రిపురసుందరీ ధ్యానము** చేయవలెను. గురుమంత్రాదులకు భావనముచే ఏకత్వసంపాదనము యుక్తము. దానిచే అంతరాత్మ వేదనముకల్గును. తనకు దేవతకు ఐక్యముపాధినిరాసముచే కల్గును. దేవతకు, మంత్రమునకు ఐక్యము వాచ్యవాచకభావనచే సిద్ధించును, అట్లే గుర్వైక్యమును సంపాదించునది. ఈ విధముగా గురుమంత్రదేవతాత్మల ఐక్యభావన చేయుటకు ఉపాసనా సమయమున అవకాశము లేనప్పటికీ క్షణమాత్ర మొనరింపదగును. అది పురుషసంస్కారహేతువు కాగలదు.

**అజపావిధానము :** జపము మానసికము, వాచికము అయిన మంత్రావృత్తి, అజప తద్భిన్నము, సహజసిద్ధము. ఉచ్ఛ్వాసనిఃశ్వాసలు **"హంసస్సోఽహం"** అను స్వరూపమున సకల ప్రాణులకు ఆధారభూతములుగా నున్నవి. సకలేంద్రియములకు ప్రేరకము. ముఖ్యప్రాణవృత్తి ఆవృత్తిరూపము. దీనినే గాయత్రియందురు. హంస శబ్ద జపము అహోరాత్రములు 21600 పర్యాయములు సంచరించును. షడంగదేవతలను హంస మంత్రముతో పూజింపవలెను. సాక్షాత్పరమహంసరూపము హంసమంత్రము. పామరులు అజప ఉచ్ఛ్వాస నిఃశ్వాసల రూపమైన వాయువృత్తి అనుకుంటారు. ఎంతకాలము 'అజప' యుండునో అంతకాలమే ప్రాణవ్యవహార ముండును. అజపా విధానమును గురుముఖమున తెలియవలెను.

**ప్రార్థన :** భూప్రార్థనమావశ్యము. కాకున్న భూదేవత కోపించును. శ్వాసయుక్తమైన పాదము భూమిపై నుంచి చిత్తప్రసాదము సంపాదించవలెను. శౌచమొనరించుకొని దంతధావనాదిక మాచరించి, స్నానమొనరింపవలెను. ఆయా నియమానుసారము స్నానమొనరింప వలెను. స్నానపూర్వకముగా క్రియలుండును. తిలకధారణ మొనరించి, పవిత్రము ధరించి ప్రాణాయామము చేయవలెను. సాయం సమయమున కూర్చొనియు, ప్రాతఃకాల, మధ్యాహ్న కాలములందు నిలబడియు ప్రాణాయామత్రయ మొనరింప వలెను. పూరకము, కుంభకము, రేచకము ప్రాణాయామాంగములు.

వాయువు నాకర్షించి నాడులను పూరింపగా కేశమునుండి నఖాగ్రమువరకు నిరోధింపగా వాయువునుండి అగ్ని జనించును. అగ్నినుండి జలముదయించును అపుడు అంతశ్శుద్ధి కల్గును. నెమ్మదిగ నాసాపుటమునుండి వాయువును విడువవలెను. శరీరము కంపింపరాదు. నాభి మధ్యమునందు బ్రహ్మను ధ్యానించుము. పూరకము చేయవలెను. కుంభకమునందు హృత్పద్మమందు జనార్దన స్మరణము చేయవలెను. రేచకమందు శివుని లలాటమందు ధ్యానించవలెను. ఇడానాడితో వాయువునుపీల్చి ఉదరము పూరించి, నెమ్మదిగా పింగళ నాడితో విడువవలెను. ప్రాణవాయువు శరీరగతమై నిగ్రహింపబడగ ప్రాణాయామమగును.

**అగర్భ ప్రాణాయామము, సగర్భ ప్రాణాయామము** అని రెండు విధములు. ప్రాణాయామములో గాయత్రిని స్మరింపవలెను. 5 వ్రేళ్ళతో నాసాగ్రము పట్టుట. "**ప్రణవము**" అని పేరుగలముద్ర. వానప్రస్థులకు, గృహస్థులకు ఇది తగును కనిష్ఠిక, అనామిక అంగుష్ఠములతో నాసాగ్రపీడనము "**ఓంకారముద్ర**". ఇది యతికి, బ్రహ్మచారికి యుక్తము. **"మాతృకా"పేరుగల తాంత్రిక ప్రాణాయామము జపారంభములో చేసిన వర్ణవ్యత్యాసాది దోషములన్నియు నశించును.** నిఖిల కర్మాంగముగా నున్న ప్రాణాయామము "ముఖ్యప్రాణవిద్య" ప్రణవధ్యానము యుక్తము. ఛాందోగ్యములో "గాయత్రీ వా ఇదం సర్వం భూతం" అనిన్నీ, బృహదారణ్యకములో "భూమిరంతరిక్షం ద్యౌ" మొదలైన శ్రుతులు ప్రాణాయామములో గాయత్రిని ధ్యానించవలెనని చెప్పుచున్నవి. ప్రాణాయామముకన్న ఇతర తపస్సులేదు. దానివల్ల దోషము నశించును. మనస్సుకు యోగ్యత కల్గును. బాహ్యదృష్టితో ప్రాణాయామము అల్పముగా కన్పించిననూ, ఫలదృష్టిలో మహోత్తమము. అజ్ఞానిదృష్టిలో దేహము సప్తధాతుమయపిండమువలె నున్నప్పటికీ, శాస్త్రదృష్టితో విద్వదనుభవముతో పరిశీలింపగా శరీరము పంచకోశాత్మకమని గోచరించును.

**పంచకోశములు :** అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ ములు పంచకోశములు. పంచావయవసహితమై ప్రత్యక్షముగా కనపడునది స్థూల అన్నమయము. అన్నమయకోశము విలక్షణమైనది. సర్వేంద్రియములకు బలమునిచ్చునది ప్రాణమయకోశము. ఇది అప్రత్యక్షము. ఉచ్ఛ్వాసనిఃశ్వాసలచే గోచరించును. ప్రాణమయముకన్న మనోమయము విలక్షణము. ఈ కోశత్రయ వివక్షయుక్తము. ఈ స్థూలదేహమందు నాడులనేకములున్నవి. ప్రాణమయమందునూ కలవని యోగిజనప్రత్యక్షములగునని శ్రుతి స్మృతి వాదము. వైద్యులకు గోచరము

కాదు. అపానస్థానముకన్న రెండంగుళములుపైగా సుషుమ్నా నాడియున్నది. బ్రహ్మరంధ్రమువరకు అది వ్యాపించి యున్నది. సుషుమ్నకు అటునిటు ఇడా, పింగళా నాడులు కలవు. ఇంకను గాంధారి, హస్తజిహ్వా మొదలగు నాడులున్నవి. అన్నియు నాభికందము ననుసరించి యున్నవి. స్థూలసూక్ష్మములైన నాడులు 72 వేలుగా కలవు. అన్నియు లెక్కింప శక్యముకాదు.

**సుషుమ్నా :** సుషుమ్నా నాడి సర్వనాడులకు అధిష్ఠానము. సుషుమ్నా శిఖామధ్యము నందు పరమాత్మకలదు. సుషుమ్నా నాడియందు కుండలినీ ప్రాణశక్తి యున్నది. కుండలినీ ప్రాణమయకోశమునకు మూలాధారము. అదే ప్రాణశక్తి. ప్రాణమయము సుషుమ్నచే ప్రచలితమగును. ప్రాణశక్తిచే కుండలిని కదులును. మనోమయకోశముచే కుండలిని స్పందించును. మనోమయములో ఎట్టి సంకల్పము లుండునో అవి కుండలినిలో కూడుకొనును. ప్రాణమయకోశమునకు కుండలినీశక్తికి అన్నమయ కోశము ఆధారముగా నున్నది. ప్రాణమయకోశ నిగ్రహము కుండలినీ ఆధీనము. కావున కుండలినిని నిరోధింపవలెను. ఇడా, పింగళవాయువు పూరణముచే సర్వ నాడులు పూరితములగును. కుంభకముచే నాడులలో నిరోధము కలుగును. తదను-గుణముగనే నాడులకు చలనము కలుగును.

**సంధ్యోపాసనము :** సంధ్యోపాసనము వేదవిధి. గాయత్రీమంత్రావృత్తి సహితముగా "**సోఽహమస్మి**" అని సంధ్యాదేవతను భావింపవలెను. సంధ్యాశబ్దము దేవతావాచకము. యోగ్యకాలవాచకమును అగును. తంత్రము కూడా సంధ్యాశబ్దార్థము. సంధ్యా కాలములు నాలుగు. సాయం, ప్రాతః, మధ్యాహ్న, మధ్యరాత్రములు. సంధ్యాకాలముల నాల్గింటిలో చిచ్ఛక్తియైన గాయత్రిని ధ్యానింపవలెను. సంధ్యోపాసనము శ్రౌత, స్మార్త కర్మానుష్ఠానయోగ్యతాహేతువు. సంధ్యోపాసనమవశ్యకర్తవ్యము.

వైదికసంధ్య, తాంత్రికసంధ్య అని సంధ్య రెండు విధములు. వేదాధికారము కలవారలకు **వైదికసంధ్య**. ఆ యధికారము లేనివారలకు **తాంత్రికసంధ్య**. సంధ్యో-పాసనము సంధ్యాకాలవిహితము. తాంత్రికసంధ్యకూడ అదేకాలములో చేయవలెను. రెండు సంధ్యలు ఒకే పర్యాయమాచరించుట కుదరదు కావున వేదాధికారముగల ద్విజునకు తాంత్రికసంధ్యయందు అనధికారము అనునది శ్రుతి స్మృతి న్యాయసమ్మతము. స్త్రీ, శూద్రాదులు వైదికసంధ్యాసమయమున తాంత్రిక సంధ్య ననుష్ఠింప వలెను.

**స్వశాఖావిధి :** అనుష్ఠానభేదమువలన బహువిశేషములున్నవి. ఏ శాఖలో నెవడు పుట్టినాడో ఆ మార్గము ననుసరించి సంధ్య ననుష్ఠింపవలెను. సంధ్యాతంత్రవిశేషములో శాఖాభేదమున భేదముకలదు.

ప్రాణాయామము, సంకల్పము, సామాన్యము, మార్జనము, ఉదకప్రాశనము, అఘమర్షణములు పూర్వాంగములు. సంకల్పాదిగా ఆత్మప్రదక్షిణాంతము అర్ఘ్యప్రదానము, ఉద్వాసనాంతము గాయత్రీధ్యానము, ఇతరము సర్వము ఉత్తరాంగము. ఆదిత్యోపస్థానము ఉత్తరాంగము.

**తాంత్రికసంధ్యాతంత్రము :** మూలమంత్రముచే ఆచమనత్రయము, ప్రాణాయామ త్రయము నాచరించవలెను. మంత్రాంగములను కరన్యాసపురస్సరముగా నాచరించ వలెను. ధేనుముద్రచే జలమునమృతీకరించి, సప్తవార మభిమంత్రించి, శిరస్సున ప్రోక్షించుకొనవలెను. దేవుని ధ్యానించి జలమభిమంత్రించి ఆజలమును వామ-హస్తమున ధరించి దక్షహస్తముచే సంప్రోక్షించు కొనవలెను. అనంతరము అర్ఘ్యత్రయము ఇవ్వవలెను. మూడు తర్పణము లొనరించి అష్టోత్తరశతము జపించునది. సూర్యమండలమునుండి దేవుని హృదయమున విన్యసింపవలెను. ఈ సంధ్యోపాసన ప్రక్రియయందు ఇచ్చు సూర్యార్ఘ్యప్రదానము ఆరోగ్యహేతువు.

**నిత్యహోమము :** నిత్యహోమము ఆహితాగ్నికి అగ్నిహోత్రము, గృహస్తునకు ఔపాసనము విహితములు. **'అగ్నిర్దేవో ద్విజాతీనాం' 'ఆగ్నే యో వై బ్రాహ్మణ' 'యో వై స్వాం దేవతామతి యజతే ప్రస్వాయై దేవతాయై చ్యవతే నపరాం ప్రాపోన్నోతి. పాపీయాన్భవతి ' 'అగ్నిముఖా వై దేవాః"** అను శ్రుతులననుసరించి అగ్నిముఖముగా దేవతలు తృప్తిపొందుదురు. బ్రాహ్మణుడు తప్పక అగ్నిహోత్రము చేయవలెను. యథాధికారము బ్రహ్మయజ్ఞ, తర్పణము లాచరించునది. నిత్యాధ్యయనమాత్రమున సర్వయాగఫలప్రాప్తి, ఆదిత్యాది సాయుజ్యప్రాప్తి కల్గును. ఇంతవరకు ఇది సాధారణ నిత్యక్రమము.

**అసాధారణము :** అసాధారణము ఇట్లు గ్రహింపవలెను. యాగమందిరము జేరి గురూపదేశానుసారము పంచాయతనమర్చింపవలెను. అనంతరము మాధ్యాహ్నవిధి యొనరించి భుజించునది. పితృతర్పణము, వైశ్వదేవము విధివిధానమున ఆచరించునది. అన్నసంస్కారార్థమైన వైశ్వదేవము కర్తవ్యము. "**వైశ్వదేవాన్న ప్రమదితవ్యం**"

**అతిథిపూజనము :** ఇతరగ్రామమువాడై, ఏకరాత్రము మాత్రము యుండువాడు అతిథి. వైశ్వదేవాంతము అతిథిని పూజింపవలెను. పరివ్రాజకుడు ముఖ్యుడు. "యతిశ్చ బ్రహ్మచారీ చ పక్వాన్న సామినావుభౌ" యతి హస్తమున జలమిచ్చి భైక్ష్యమీయదగును. అతిథి ఆశాభంగమైన అనర్థము కలుగును. "**అతిథిపూజాన్న ప్రమదితవ్యమ్**"

మాధ్యాహ్నికవిధి నిర్వహించి భుజింపవలె. భోజనమునందు సంస్కృతాన్నభక్షణము, యుక్తాహారస్వీకారము నియమముగా నుండవలెను. ప్రాఙ్ముఖుడై భుజించిన ఆయుష్యము పొదును. దక్షిణాభిముఖుడు యశస్సును పొందును. ప్రత్యఙ్ముఖుడు శ్రీ భాజనుడు, ఉత్తరాభిముఖము పితృకర్మలో తప్ప పనికిరాదు. మండలములేకున్న అన్నరసమును పిశాచములు గ్రహించును. బ్రాహ్మణులకు చతురశ్రము, క్షత్రియులకు త్రికోణము, వైశ్యులకు వర్తులము, శూద్రులకు అర్ధచంద్రము విహితము. భోజనము ముఖ్యప్రాణరూపమైన అగ్నికై హోమమని గ్రహింపవలెను. పంచాహుతులు, ముఖ్యప్రాణవిధానములు. **ఇది వైశ్వానరవిద్య**. ఈ చెప్పిన విధమున భోజనము అభీష్టసిద్ధి హేతువు. భోజనానంతరము తాంబూలము సేవింపవలెను.

దివా స్వాపమైథునములను పరిత్యజించి విరామము లేకుండ సిద్ధాంతచింతనము నొనరింపవలెను. సాయంతనసంధ్యాహోమముల నాచరించి దేవార్చన మాచరించ వలెను. రాత్రి భోజన మైచ్ఛికము. అనంతరము శయనవిధి. నిమిత్తానుసారముగా "**ఋతౌ భార్యాముపేయాత్**" అనారోగ్యహేతువుగా ప్రవర్తింపరాదు. నిద్రించునపుడు ఉత్తరశిరస్కుడు కారాదు. ప్రాక్శిరస్కుడై, దక్షిణ శిరస్కుడై ఇష్టదేవతను ధ్యానించి నిద్రించవలెను. తన గృహమున ప్రాచీశిరస్సు, శ్వశుర గృహమున దక్షిణముగా శిరస్సు యుండవలెను. ఎప్పుడునూ ఉత్తర శిరస్కుడుగా శయనింపరాదు.

**అసాధారణతంత్రం :** శ్రీ కల్యాణదేశికులు తంత్రజ్యోత్స్నా గ్రంథములో ఈ అంశమునే ముఖ్యముగా నిరూపింపదలచినారని విషయమహత్త్వము ననుసరించి ఊహింపనవసర మున్నది. ఈ ఘట్టములో 43 ముఖ్యవిషయములు వ్యాఖ్యానసహితముగా నిరూపితములైనవి.

**1. కలశహస్తత :** జలముతోనున్న బ్రహ్మలింగమైన కమండలమును ధరించినందున బ్రహ్మభావము కల్గును. అది పవిత్రహేతువు.

**2. సంభారవాన్ :** పూజాసంభారములను తీసుకొని భగవద్ధ్యాన మొనర్చుచు యాగమందిర పశ్చిమద్వారము చేరవలెను. "**మౌనమమృతస్య సేతుః**" మౌనముగా మంత్రభావనచేయుచూ వెళ్ళవలెను.

**3. యాగమందిరము :** అర్చనా మందిరమునే యాగమందిరమని యందురు. అచటకు దక్షిణపాదము ముందుగా నుంచి ప్రవేశింపవలెను.

**4. యజ్ఞవాటి ప్రదక్షిణము :** యజ్ఞవాటము దేవాలయమే. దేవతాదేహమే దేవాలయము. ఈ ప్రదక్షిణము దేవతానుగ్రహహేతువు.

**5. పశ్చిమద్వారస్థితి :** పశ్చిమద్వారము నందుండుటచే సాధకుడు ప్రాఙ్ముఖుడగును. అనంతరము ద్వారసంస్కార మొనరించి మందిరప్రవేశము ప్రాగ్గమనముతో చేయవలెను. పశ్చిమ, దక్షిణ దిశలు ఆసురములుగాన ఆముఖముగా వెళ్ళరాదు.

**6. ప్రక్షాళనము :** పాదప్రక్షాళనము బాహ్యశుద్ధ్యర్థము. ఆచమనమంతశ్శుద్ధ్యర్థము. బాహ్యాన్తశ్శుచియై సాధకుడుండుట ఆవశ్యకము.

**7. గురుస్మరణము :** గుర్వనుగ్రహమునకై ఇది ఆవశ్యకము. విద్యాసిద్ధి, దేవతా–నుగ్రహము దీనివల్ల కల్గును. ఈ సమయముననే గణపతి స్మరణము దిక్పాలస్మరణము సాధకానుగ్రహమున కగును. అప్పుడు సాధకునకు సర్వతః రక్ష యుండును. ఈ సమయమున ఇష్టదేవతాస్మరణ మవసరము. దానివలన జపాదులలో ఇష్టదేవత అభిముఖమగును.

**8. మంత్రద్వయ పఠనము :** "దేవి త్వ త్ప్రకృతం చిత్తం పాపాక్రాన్తమభూన్మమ, తన్నిస్సరతు చిత్తాన్మే పాపం హూంఫట్ చ తే నమః. సూర్యస్సోమో యమః కాలో మహాభూతాని పంచ చ, ఏతే శుభాశుభస్యేహ కర్మణో నవసాక్షిణః" ఈ మంత్రద్వయము పూర్వపాపము నశించుటకు అవసరము. దృఢతరమైన పాపము పూజా సమయములో విఘ్నములను కల్గించకుండుటకు ఇది అవసరము. పాదప్రక్షాళన, ఆచమనములు పాపనివారణ సమర్థములు.

**9. సూర్యార్ఘ్యప్రదానమువల్ల** నక్షత్ర రాసులన్నియు అనుకూలము లగును.

**10. ద్వారపూజా :** యాగమందిరము సర్వదేవతామయము. అచటి ద్వారములు కూడ దేవతామయములే. ద్వారదేవతాపూజవలన ఆ దేవతలు విఘ్నములను లోనికి చొరనీయవు.

**11. అంతర్విఘ్ననివారణము :** వామపార్ష్ణిఘాతత్రయ, రం ఇతి అగ్నిబీజేన ఛోటికాత్రయ, సుదర్శన రక్షలచే భౌమాంతరిక్ష, దివ్య విఘ్నములు నివారితములగును.

**12. ద్వారాచ్ఛాదనము :** "సర్వదైవత్యం వై వాసః" వస్త్రమునందు సర్వదేవతలు యుందురుగాన ద్వారమును వస్త్రముతో ఆచ్ఛాదించిన రక్షణ కల్గును.

**13. మండపప్రోక్షణము :** మలిన ప్రదేశమునందు క్షుద్రదేవతలుందురు గాన పంచగవ్యము ప్రోక్షించి స్థలశుద్ధిచేసి అలంకరించినచో దేవతాస్థితికి యోగ్యమగును.

**14. వాస్తుపురుషాదుల పూజ :**

"స్వగేహే వాస్తుపూజాం చ మండపేషు సమాచరేత్
నాకాలమరణవ్యాధిర్భూతప్రేతాదిభిర్న న
న సర్పపీడా నాన్యోన్యకలహాద్యశుభాని చ ।
పుత్రపౌత్రధనారోగ్యపశుదాసీసమృద్ధిభాక్ ।
అరోగీ విజయీ ఖ్యాతశ్చిరం జీవతి తద్గృహే ॥

వాస్తుపూజవల్ల అకాలమృత్యువ్యాధులు, సర్పపీడ, అనారోగ్యము లుండవు. పుత్రపౌత్రాభివృద్ధి యుండును.

**15. పూజావేది :** పూజావేదికలో పూజ్యపూజకసంబంధము పూజోపకరణములు, ఆసనము దేవస్థానము పవిత్రముగా నుండవలెను.

**16. ఆసన సంస్కారము : యజ్ఞసమయములో పత్ని ఆజ్యమును చూచుటచే ఆజ్యము సంస్కృతమైనట్లు ఆసనస్థలమును ఉపాసకుడు మూలమంత్ర ముచ్చరించుచూ చూచిన సంస్కృతమగును.**

**17. కూర్మచక్రము :** షట్కోణం విలిఖేదాదౌ ముఖే హ్రీంకారమేవ చ పృష్ఠే మన్మథ బీజం స్యాచ్చతుష్కోణేషు తారకమ్ । అష్టపత్రేష్వష్టవర్గం కూర్మచక్రం విధీయతే.

కూర్మము సకలజగదాధారము కదా! దేవాలయములలలో ప్రతిష్ఠించిన విగ్రహముల దిగువన ప్రతిష్ఠించిన యంత్రములచే విగ్రహములకు పూజాయోగ్యత దేవతాత్వము సిద్ధించునట్లు, **కూర్మచక్రమునందు మాతృకాలేఖనము చేసి దానిమీద ఆసనము పరచుకొని సాధకుడు కూర్చున్నచో వానికిన్నీ దేవతాభావన అవిఘ్నముగా కల్గి సకల– మంత్రానుష్ఠానయోగ్యత కల్గును.**

**18. ఆసనదేవతలు :** ఆధారశక్త్యాది 14 పీఠదేవతలను పూజించి చేలాజినకుశ ఆసనమును ఉంచి దానిమీద కూర్చుండవలెను. దీనివలన సాధకుని దేహములో విద్యుచ్ఛక్తినిపోలిన అపూర్వశక్తి గలుగును.

"శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్ ॥" – భ. – 6.11.

వస్త్రాసనము లక్ష్మీప్రదము, కృష్ణాజినము జ్ఞానసిద్ధినిచ్చును. వ్యాఘ్రచర్మము మోక్షప్రదము, కుశాసనము పుష్టికరము దురితక్షయము, కంబలము దుఃఖమోచనము, శ్వేతకంబలం ధర్మసిద్ధి నిచ్చును. ద్విజేతరులకు కృష్ణకంబలము మోక్షప్రదము. దారుకాసనము శోకము కలిగించును. వెదురు ఆసనము దరిద్రము నిచ్చును. బండ, మట్టి, పల్లవ, గడ్డి ఆసనములు పనికిరావు. కోణదేవతలను పూజించిన స్వరక్షణము కల్గును. సాధకుడు తూర్పుముఖముగాని, ఉత్తరముఖుడుగాగాని కూర్చుండవలెను. ఇతర దిశలు ఆసురములు. ఋజుకాయముతో కూర్చుండవలెను. "**సమం కాయ-శిరోగ్రీవం ధారయన్న చలం స్థిరః**". స్వస్తికాసనముగాని, పద్మాసనముగాని చిత్తస్థైర్య హేతువులు.

**19. శిఖాబంధనము : "విశిఖోఽనుపవీతీ యచ్చ కరోతి తన్నిరర్థకమ్ । స్నాన-దానాదికం సర్వమాసురమపి భవతి"** దైవకర్మలో శిఖాబంధము దేవతాప్రీతి హేతువు.

పై విధముగా ఆసనమందు శిఖాబంధము చేసినచో "**తతః ద్వంద్వానభిఘాతః**" శీతోష్ణసుఖదుఃఖాల సహించు శక్తి కలుగును.

ఇంతవరకు అసాధారణతంత్రములో పూర్వాంగము.

**20. పూజాద్రవ్యసంస్కారము : నారాచముద్ర** చూపుచూ **హ్రీం హూం ఫట్** అను మంత్రముచే దక్షభాగమునయున్న పూజాద్రవ్యములను సంస్కరింపవలెను.

**21. దీపసంస్కారము : 'రం'** అను బీజముచే దీపశిఖను స్పృశించినచో అది సుఖప్రదమగును.

**22. జలకుంభము :** "క్ష్రైః" అను బీజముచే దేవతీర్థముచే కుంభములోని జలమును స్పృశింపవలెను. దానివల్ల దానిలోని దోషములు నశించును.

**23. దిగ్బంధనము, ఆత్మరక్షణ :** దిగ్బంధనాదికమువల్ల భూతప్రేతపిశాచాదులు దూరమగుదురు. దిగ్బంధన, ఛోటికాత్రయము, వహ్నిప్రాకారత్రయమును భావించి, శూలమున రక్షణ సంపాదింపవలెను.

**24. యంత్రము :** దేవతా చక్రమే యంత్రము. రజత యంత్రము సర్వైశ్వర్య ప్రదము. మాణిక్యరచితమైన యంత్రము రాజ్యప్రదము. లోహత్రయ యంత్రము సర్వసిద్ధిదము, యంత్రము యమాదులనుండి, భయములనుండి రక్షించును. యంత్రము లేనిచో శివలింగము, సాలగ్రామము ఆదిత్యము (స్ఫటికము) గణపతి, శక్తిని పూజింపవలెను. వామాచారులు పూజించిన యన్త్రమును పూజించిన క్షోభ కలుగును.

"వామినోపాసితం యన్త్రం తేషాం దృష్టిపథం గతమ్ ।
తద్దేవతా క్షోభకరం విక్షిప్తస్సాధకో భవేత్
దక్షిణోపాసితం యన్త్రం సూర్యాగ్నిసమతేజసమ్ ।
పాపినో నైవ పశ్యన్తి యథోలూకాస్తమోదృశః
యథా నృభిర్దినకరోదయః సర్వైరి హేష్యతే
దక్షసంస్థాపితం యన్త్రం తథా పుణ్యాత్మనాం మతమ్ "

**25. నిర్మాల్యవిసర్జనము :** పూజా సంకల్పకాలమున నిర్మాల్యము దూరముంచవలెను.

**26. పీఠము :** దేవతకు ఆసనయోగ్యమైన స్థానము. పూజాచక్రమును పీఠము నందుంచవలెను. అతలాది సప్తలోకములను, మండూకాది పరతత్త్వాంత పీఠ దేవతలు సర్వమున్నూ పరమేశ్వరి పీఠస్థానము.

**27. పాత్రాసాదనము :** పూజలో దేవతకు సమర్పించు ద్రవ్యము పాత్రమనదగును. అర్ఘ్యపాత్రను సమంత్రకముగా మొదట కూర్పవలెను. **అర్ఘ్యపాత్రనే శంఖ**మందురు. దేవతా భేదము ననుసరించి ద్రవ్య భేదముండును. నిత్యపూజలో శంఖమను అర్ఘ్యపాత్ర యుక్తము. అర్ఘ్యాదిక్రియలన్నియూ దానిచే చేయుదురు. మధుపర్కమునకై ఒకటి స్నానార్థమై జలపూర్ణమైన కలశము యుక్తము . పాత్ర వ్యవస్థ సంప్రదాయమున విశేషముగా గ్రహింపవలెను.

**28. పీఠపూజ :** పూజాపీఠము నిర్మించి పీఠదేవతలను పూజింప వలెను. గురుపంక్తి, మహాగణపతి, అతలాదులు, మండూకాదులు, వరాహము, దంష్ట్రాగ్రమున సుధార్ణవము, స్వర్ణశైలము, నందనవనము, కల్పవృక్షములు, స్వర్ణప్రాకారము, రత్నమండపము, రత్నసింహాసనము పూజింపవలెను. వేదీమధ్యంలో సింహాసనము భావింపవలెను. పూజాచక్ర ఆధారపీఠము సింహాసనము అణిమాది సిద్ధులను, అర్చింపవలెను. నవశక్తులను ఆరాధింపవలెను. ఈ 44 మందిరమంత్రములతో పూజించిన భక్తులకు చక్కని హర్మ్యములేర్పడును.

**29. దీపారాధనము :** ఘృతదీపము, తైలదీపము పీఠదేవతా పూజానానంతరము ప్రజ్వలింప చేయవలెను. దీనివలన మృత్యువు నశించును.

**30. భూతశుద్ధి : "భూతశుద్ధివిహీనేన కృతా పూజాఽభిచారవత్ ।** విపరీతఫలదద్యాద-భక్త్యా పూజనం యథా।" భూతశుద్ధి భావనావిశేషము పురుషసంస్కారరూపము.

సాధనకు శరీరము ప్రవిలాపన విధానమున కారణ భావము నొందును. పవిత్రమైన దేవతా శరీరము కలుగును. భూతశుద్ధి లేకున్న అనర్థకము కలుగును.

**31. ప్రాణప్రతిష్ఠ :** నూతనశరీరము కల్గగా సర్వప్రాణములు యథాతథముగా సంస్థాపనము లగును. సాధకుల దేహము జ్యోతిర్మయ మగును. న్యాస సంస్కారమున కంగముగా సగర్భమైన మాతృకా ప్రాణాయామము ఇదివరలో నిరూపితము.

**32. న్యాసము :** ఇదియు పురుషసంస్కారరూపమే. న్యాసముతో కూడుకొని మంత్రజపము చేయగా విఘ్నములు నశించును. న్యాసములేక జపించువానిని విఘ్నములు బాధించును. కామనా భేదముగా న్యాసభేదములున్నవి. దేవతాభేదముననూ న్యాసము వేరుగా నుండును.

సాధారణ అసాధారణ భేదములతో న్యాసము 2 విధములు. అంతర్మాతృకా, బహిర్మాతృకా, కళామాతృకా న్యాసములు నిత్యము. అసాధారణ న్యాసము దేవతా భేదమున నుండును. కళాన్యాసము షడంగన్యాసములు నిత్యము. న్యాస మనగా న్యాయోపార్జితములు, అయిన విత్తములను దేహమునందు కూర్పగా సర్వరక్ష కల్గును. "అకృత్యా న్యాసజాలం యో మూఢాత్మా కురుతే జపమ్ । విఘ్నైస్స బాధ్యతే నూనం వ్యాఘ్రైర్మృగశిశుర్యథా।" సర్వమంత్రములకు ఋష్యాదిన్యాస మావశ్యకము. గురువును శిరస్సునందు విన్యసింపవలెను. ఛందస్సును ముఖము నందును, దేవతను హృదయ మందు న్యసింపవలెను. ఇట్లే న్యాస విశేషములున్నవి.

**33. ముద్రలు :** దేవతలకు ముదమునిచ్చునది. వారి మనస్సును ద్రవింపచేయును గాన ముద్ర. హస్తాది విన్యాసము ముద్ర. ముద్రను ఎప్పుడును మహాజన సమూహములో ప్రదర్శింప గూడదు.

**34. దేవతాధ్యానము :** తన హృదయమందు అభీష్టదేవతాచింతనము ధ్యానము. ధ్యేయమాలంబనముగా మనస్సును ప్రసరింపచేయుట ధ్యానము. అదియే ఉపాసనము. ఉపాస్యమును విషయముగా చేసుకొనుట ధ్యానము. తైలధారవలె అవిచ్ఛిన్నముగా ప్రసరింపవలెను. ఇవి సగుణము, నిర్గుణము అని రెండు విధములు. హృదయమందు ఆగమములోని ధ్యాన శ్లోకమునందు వర్ణించిన రీతిని ఇష్టదేవతా ధ్యానము సగుణము. జీవబ్రహ్మైక్యమును భావించునది నిర్గుణము. "**స్త్రీరూపం వా స్మరేద్దేవీం, పుంరూపం వా విచిన్తయేత్, అథవా నిష్కలం ధ్యాయేత్**" అని తంత్రము చెప్పుచున్నది. ఆధార పీఠమందు వర్ణ సంక్లప్త విగ్రహ అయిన పరమేశ్వరిని ఆరాధింపవలెను. ఇట్లు

దేవతాస్వరూపము బహుధా వర్ణితము. గురు, చక్రదేవతోపాసక ఉపాసనా భేదములను పంచవిధములు దేవతా స్వరూపము. ఆ దేవత పరము, అపరమని శాస్త్రము చెప్పుచున్నది. అందు పరము "**సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" "ఆనందో బ్రహ్మ**" అనునది. అపరము పంచాత్మకము. పంచవిధములుగా నున్నది. శిరస్సు, రెండు పక్షములు, పుచ్ఛము. ఆత్మ అనునవి. ఆనన్దమయ, విజ్ఞానమయ, మనోమయ, ప్రాణమయ, అన్నమయములన్నవి ఐదు. పంచ విధములు. ఇవి అన్నియూ **తైత్తిరీయోపనిషత్**లో వివరింపబడ్డవి. ఆనన్దమయమునకు శిరస్సు, ప్రియము, మోద, ప్రమోదములు పక్షములు, ఆనన్దమే ఆత్మ, బ్రహ్మయే పుచ్ఛము. ''సోఽకామయత'' అని ఆనందమయమున కామన సంభవించినది. కాన "కామ" శబ్దముచే వ్యవహరింపదగి యున్నాడు. "కామశ్చ అసౌ ఈశ్వరశ్చ" ఆనందమయుడే కామేశ్వరుడు. అతని శరీరము పంచాత్మకమైన కళ. ఈ కళయే, ఆనందమయునకుపాధి, కామకలారూపమును సంప్రదాయములో తెలియవలెను.

**ఛాందోగ్యము**లో ఆనందమయుడే, పరామర్శింపబడెను. ఆతడే కామేశ్వరీ శబ్దవాచ్యుడు. వేదములో శబ్దములకు లింగభేదముగాని, స్త్రీపుంవ్యవస్థగాని లేదు. "స వై నైన రేమే, స ద్వితీయమైచ్ఛత్" స హైతావానాస, యథా స్త్రీ – పుమాగ్ంసౌ సంపరిష్వక్తౌ। స ఇమమేవాత్మానం ద్వేధా పాతయత్, తతః పతిశ్చ పత్నీ చ అభవతామ్" పరమాత్మ యొక్కడే యుండెను. ఆతడు రెండవదానిని కోరెను. స్త్రీ పురుషాత్మకము రెండుగా నాయెను. వారే పతిపత్నీభావమున నుండిరి. కామేశ్వర, కామేశ్వరీ శబ్దవాచ్యమును ఇదే ఆ ఆనందమయునకు ప్రణవము వాచకము. "**తస్య వాచకః ప్రణవః**" ప్రణవరూపుడు, ప్రణవవాచ్యుడు ఆనందమయుడే. ఆనందమయోపాసనలో విశేషములను సంప్రదాయములో గ్రహింపవలెను. ఈ స్వరూపమునకు అన్యోన్యచ్ఛేదన ప్రయుక్త ఆయత వృత్తద్వయ విశిష్ట వృత్తరూపము సంజ్ఞ. అక్షరోపాసనలో సన్న్యాసులే అధికారులు.

విజ్ఞానమయుడు పంచాత్మకుడు. శిరః పక్షాది కల్పనము కలదు. విజ్ఞానమయుడు "అహం" శబ్దవాచ్యుడు, సర్వజనులు "అహం" ప్రత్యయముతో నుందురు. ఇదం ప్రత్యయము అన్యపదార్థములను తెల్పును. "అహం" ప్రత్యయము అంతర్ముఖమై ప్రమాతనే తెల్పును. ఆత్మ "అహం నామా భవత్" అకార హకార స్వరూపమని భావము. విజ్ఞానమయునకు శిరః పక్షాది పంచ అవయవములున్నవి. శిరస్సు షోడశ స్వరములు, దక్షిణ పక్షము కవర్గము, ఉత్తరపక్షము చవర్గము. యాద్యష్టకము పవర్గము

ఆత్మ. టతవర్గములు పుచ్ఛము. ఈ విధముగా అభిజ్ఞులు శారదాస్తుతి చేసిరి. **మేరుతంత్రము** కూడ అట్లే చెప్పెను.

అకారాది, హకారాన్త వర్ణములు మాతృకారూపము విజ్ఞానమయుడు, మాతృకా–వాచ్యుడు, ఇతడే మాతృకామంత్రనాయికా. చతుర్వేదాత్మకమైన మనోమయ కోశమునకు విజ్ఞానమయుడే అధిష్ఠానము. "అహం" శబ్దవాచ్యుడైన విజ్ఞానమయుడు ధ్యానింప దగినవాడు.

మనోమయము సకలవేదాత్మకము. శిరః పక్షాదికల్పనమున్నది. మనస్సునకు సంకల్పాత్మకమైన వృత్తి యజుస్సంకేతము. ఇట్లే ఇతరవేదములున్నూ, మంత్రములు మనోవృత్తి రూపముగా నుండును. గాన మానవ జపము లుపపన్నములు. మనోవృత్తి నిష్ఠమైన ఆత్మచైతన్యము. యజురాది శబ్దములచే చెప్పబడినది. ఇట్టి ఆత్మవిజ్ఞానమే మంత్రములు.

ఆనందమయాది కోశత్రయము శబ్దగమ్యము. ఆకాశాత్మకము.

ప్రాణమయకోశము పంచాత్మకము, ప్రాణమయము సూత్రాత్మకమైన వాయువు దీనియందే ఆనందమయ, విజ్ఞానమయ, మనోమయ, అన్నమయములు కూడియున్నవి. ప్రాణమయము అజపావాచ్యము "**హంసస్సోహం**" అనునది అజపా రూపము. ప్రాణమయము ప్రత్యక్షమైన **కామకల**.

అన్నమయము పంచాత్మకము. అన్నరసమయుడు పురుషుడు, అర్ధనారీశ్వర రూపముగా భావింపదగినది. శ్రుతి, స్మృతులలో దేవత, పురుషరూపముగా, స్త్రీరూపముగా నిర్దిష్టమైనది. శ్రీసూక్త, పురుషసూక్తములలో వర్ణితమైన అన్నమయ కోశము గాయత్రి అని అనదగియున్నది. అన్నమయము "విరాట్" అనియూ అందురు. దేవతకు స్త్రీ పుం స్వరూపము ఉపనిషత్తులలో నిరూపితము. "**ఉపాసకానాం సౌకర్యార్థం బ్రహ్మణో రూపకల్పనం**" అని యుపనిషత్తులో గలదు. రూపముకల దేవతకు పుం, స్త్రీ కల్పనము. అంగాస్త్రకల్పనము యున్నది. ఆ పురుషుడే అవతారవశమున అనేక విధములయినట్లు నిరూపితమైనది. **చిదగ్నికుండసంభూతా, దేవకార్యసముద్యతా**, అను రహస్యనామములలో కూడ ఈ యంశమే నిరూపించబడినది.

దేవతలు కామరూపులు. కావున ఒకే రూపమని నిర్ణయింపశక్యము కాదు. దేవతాస్వరూపవాచకములైన మంత్రములే నిత్యములు.

"న స్వర్గే న చ తీర్థేషు నౌషధీషు న ఖేషు చ
ఋషయో దేవతాస్సన్తి మన్త్రా ఏవ తు దేవతాః ।
సాధకానాం ఫలం దాతుం తత్తద్రూపం ధృతం సురైః ।
ముఖ్యం స్వరూపం తేషాన్తు మన్త్రా ఏవ న చేతరత్।
సంస్కృతాః సాత్త్వికా మన్త్రాః పరత్రేహ చ శర్మదాః ।
జన్మాన్తరే భవేయుశ్చ బీజరూపా న సంశయః ।

నిత్యవర్ణరూపమైన రూపము ప్రత్యక్షము. మంత్రములే దేవతలని నిశ్చయించిరి. మనకువలె దేవతలకు కూడ రూపము కలదు. ముఖ్యస్వరూపము మంత్రము. **మంత్ర స్వరూపము సుషుమ్నా రూపమని రహస్యతత్త్వము**. మూలాది బ్రహ్మరంధ్ర పర్యన్తము వ్యాపించియున్న సుషుమ్న సకల దేహ వ్యాపారములకు ఆధారము. సుషుమ్న వశమైన సర్వము వశమగును. కాగా అపరము ఉపాసింపదగినది. పరరూపము జ్ఞేయమని నిశ్చితమైన సారాంశము.

బ్రహ్మ రెండు రూపములతో నున్నది. నామరూపాది విశిష్టము, సర్వోపాధి వివర్జితము. నామరూపాది బ్రహ్మ ఉపాస్యము. కొన్ని ఉపాసనలు అభ్యుదయ సంపాదకములు. కొన్ని క్రమముక్తి నిచ్చునవి. కొన్ని కర్మసమృద్ధి నిచ్చునవి. సద్గురు సమీపమున ధ్యేయమైన స్వరూపమును బాగుగ గుర్తించి ధ్యాన మొనరింపదగును.

**35. అంతర్యాగము :** దీనిని గురుముఖమున తెలియవలెను. వామనాడి నాకర్షించి గుదమాకుంచనము గావించి రేచన మొనరింపవలెను. నాలుకను తాలుభాగమున కూర్చవలెను. శివునందు శక్తిని కూర్చి ఆకుంచనము చేయవలెను. ఇట్లొనరించ న్యాసమార్గమున ఇష్టదేవతను భావించి మానసమైన చందనాదులచే యజింపదగును. మూలమంత్ర జపమొనరింపవలెను. ఇట్టిది సంక్షిప్తముగా అంతర్యాగము.

**36. మంత్రజపము :** "**మననాత్ త్రాయతే**" ఇది మంత్ర శబ్దార్థము. జపము జన్మాంతరపాపనాశకము. మంత్రములు మనోవృత్తులు. మనోవృత్తియే జపము. జపముచే దేవత ప్రసన్నమగును. "**జపాత్సిద్ధిః, జపాత్సిద్ధిః**" జపయజ్ఞము ఉత్తమము. ఆవాహన, సంస్థాపన, సన్నిరోధన, సమ్ముఖీకరణ, అవకుంఠన, సకలీకరణ, అమృతీకరణ, పరిమీకరణ, నమస్కారములు దేవతాసాన్నిధ్యమును కల్గచేయును. విధిగా ఉపచారము లాచరింపవలెను. ఆసనాది పదునారు ఉపచారములుగాని, దశోపచారములుగాని, సద్యోజాతాదులతో పంచోపచారములుగాని గృహస్తు–లొనరింపదగినవి. పంచాయతన ఆరాధనవలన సాధకునకు సర్వాభీష్టసిద్ధి కలుగును.

**37. జపము :** ఉపచారానంతరము నిత్యజప మొనరింపవలెను. అష్టోత్తరముగాని, సహస్రముగాని, త్రిశతముగాని జపమొనరింపవలెను. జపము పురుషసంస్కారార్థము నిశ్చితము. స్థలభేదమున్నది. సంఖ్యాగణనమునకు జపమాలయుండును. ప్రధాన దేవతాజపమొనరించి దశాంశము అంగదేవతా జపమొనరించవలెను. జపము సర్వాభీష్టసాధకము. అదే ఉపాసనము. సాధనములలో తపమే శ్రేష్ఠసాధనము.

**38. జపమాలా :** జపమాలను **అక్షమాల** అందురు. అకారాది క్షకారాంతములైన మాతృకాక్షరములతో జపము చేయుట ఉత్తమము. మణులుచే కూర్చిన మాల మణిమాల. మణిమాలకు మాలాశుద్ధి చేయవలెను. కరమాల నిషిద్ధము. రుద్రాక్షమాల సమస్తసిద్ధులను ఇచ్చును. మణిమాల ధనము నిచ్చును. స్ఫటికమాల భోగముల నిచ్చును. పద్మాక్షములు పుత్రప్రదములు, పుత్రజీవికలు, పగడమాల వశ్యకరము ముత్యములమాల ముక్తి నిచ్చును. స్వర్ణమాల కామముల నిచ్చును. వర్ణసంక్లప్తమైన దేవతా దేహమందు అక్షరములను భావించి లెక్కించుట అనంత ఫలదము.

**39. ఉపచారములవల్ల ప్రయోజనములు :** 1. ఆసనం : ఇంద్రపదవి వస్తుంది, 2. ఆవాహనం : శతక్రతు ఫలము, 3. అర్ఘ్యము : పాపములను నశింపచేస్తుంది, 4. పాద్యము : పాతకము నశిస్తుంది, 5. ఆచమనము : శుచిత్వము వస్తుంది, 6. మధుపర్కం : అమృతత్వము వస్తుంది, 7. స్నానము : సర్వభయములు పోతవి, 8. వస్త్రము : ఆయుష్యవర్ధనము, 9. ఉపవీతము : బ్రహ్మలోకావాప్తి, 10. గన్ధము : గంధర్వత్వము లభిస్తుంది, 11. పుష్పములు : పుణ్యము వస్తుంది, 12. ధూపము : పాపముల దహిస్తుంది, 13. దీపము : మృత్యువినాశనము, 14. నైవేద్యం : అన్ని కోరికలు సిద్ధిస్తవి, 15. నీరాజనమ్ : సామ్రాజ్యము వస్తుంది.

**40. దేవతాస్తుతి :** గీత స్తుతి విశేషములతో ఘంటానాద పురస్సరముగా స్తుతింపవలెను. ఘంటావాదనము దేవతా ప్రీతికరము. దేవతా సాన్నిధ్యహేతువు. "**ఆగమార్థం తు దేవానాం, గమనార్థం తు రక్షసాం కుర్యాద్ఘంటారవం తత్ర దేవతాఽహ్వానలాంఛనమ్**"

**41. అపరాధస్తవము :** అపరాధస్తవ పఠనమున అర్చనలో కల్గిన దోషములన్నియూ నశించును. మంచి ఫలము కల్గును. శాన్తి పాఠములోగూడ ఇట్లే గ్రహింపవలెను. అనంతరము పూజాసమర్పణము చేయునది. దీనిచే దేవతానుగ్రహము సంపన్నమగును.

**42. పాదోదకము ప్రసాదము :** దీని స్వీకారమువలన అకాలమృత్యువు. సర్వపాపములు నశించును.

**"అకాలమృత్యుహరణం సర్వవ్యాధినివారణమ్ ।
సర్వపాపక్షయకరం శ్రీదేవీ పాదోదకం పావనం శుభమ్ ॥**

గురుపాదోదకతీర్థస్వీకారముకూడా మహాఫలమునిచ్చును.

**"అవిద్యామూలనాశాయ జన్మకర్మనివృత్తయే ।
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం గురుపాదోదకం పిబ ॥"**

ప్రసాదము, యజ్ఞశిష్టము, ప్రసాదస్వీకారమువలన సర్వపాపములు నశించును. "యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః - భ - 3.13."

**43. పూజాఫలము :** ఉత్తమాధమమధ్యమ రూపమున ఇది మూడు విధములు. ఉత్తమభావనతోనూ, ఉత్తమద్రవ్యములతోనూ, ఉత్తమ ఉపకరణములతో నున్నట్టిది ఉత్తమపూజ. లభించిన పూజాద్రవ్యములతో మాత్రమే చేయు పూజ మధ్యమ పూజ. పత్రపుష్పజలములతో చేయునది అధమపూజ. పూజలు సాత్త్విక, రాజస, తామసములని 3 విధములుగా నున్నది. వేదోక్తమైన పూజను బ్రహ్మ ఋషులు నిష్కల్మషంగా చేసినచో అది **సాత్త్వికపూజ** యనబడును. భగవత్తత్త్వవిదులును తపోనిష్ఠులును అయిన రాజర్షులు ఆచరించు పూజ **రాజసపూజ** యందురు. పరిణతముకాని మనస్సుగల స్త్రీ బాల, వృద్ధులచే చేయబడు పూజను **తామసపూజ** యందురు. ఇట్లు పూజింపగా సాధకుల జీవితము సఫలమగును.

"**పూజయా భుక్తిమాప్నోతి, పూజయా ముక్తిమాప్నుయాత్**" ఇది ప్రాతఃకాలపూజ, సాయంపూజయు ఇట్లే యుండును. ఇట్లు ఇది సాధారణ, అసాధారణ రూపమైన నిత్యతంత్రము.

**నైమిత్తికతంత్రము :** పురశ్చర్యాదికము నైమిత్తికతంత్రము. సాధనకు మంత్రము స్వీకరించి మంత్రసిద్ధికై పురశ్చరణము చేయవలెను. "**పురా యచ్చ చర్యతే పురశ్చరణ కర్మాఖ్యం**" జపము, హెూమము, తర్పణము, మార్జనము, విప్రభోజనము ఈ ఐదును పురశ్చరణాంగములు. దుఃఖభూయిష్ఠమైన సంసారమునందు ఆత్మసిద్ధి నభిలషించు వారు మంత్రజపమును చేయవలెను. దశాంశము హెూమము, తద్దశాంశము తర్పణము, తద్దశాంశము విప్రభోజనము జరుపవలెను. ఈ లింగములను ప్రత్యక్షముగా చేయ వీలుపడనిచో ఆ సంఖ్యకు ద్విగుణముగా జపము చేయవలెను. గాయత్రియు దశాంశము చేయవలెను. ఉపదేశసామర్థ్యమువల్ల, గురుప్రసాదమువల్ల, మంత్ర ప్రభావమువల్ల, భక్తిచేతను, మంత్రసిద్ధి కలుగును.

**పురశ్చరణఫలము :** ఉద్యానవనములు, బిల్వమూలము, గిరితటము, దేవతాయతనము, సముద్రకూలము, నిజగృహము, మంత్రసాధనకు ప్రశస్తము, దీపనాథుని యజించి జపపూజాదికమును చేయవలెను. యోగ్యమైన ఆసనమును సిద్ధము చేసుకొని (చేలాజినకుశోత్తరం) స్వస్తిక, వీరాసనములతో కూడుకొని జపమొనరింప వలెను. న్యాసముతోకూడి మంత్రము జపించువానిని విఘ్నములు చేరవు.

అక్షమాల రెండు విధములు. కల్పితము, అకల్పితము. మణిమాల కల్పితము, మాతృక అకల్పితము, మానసజపము ఉత్తమము, **స్తోత్రము మనసా స్మరింపరాదు.** మంత్రార్థము, మంత్రచైతన్యము యోనిముద్రను గుర్తించి జపింపవలెను. జననము, జీవనం, తాడనం, బోధనము, అభిషేకము, విమలీకరణము, ఆప్యాయనము, తర్పణము, దీపము, గోపనము. ఇవి మంత్రదోషహరములైన సంస్కారములు. కొన్ని మంత్రములకు సిద్ధాది శోధనము అక్కరలేదు. మాలామంత్రములలో సిద్ధాది శోధన మక్కరలేదు. ఆలస్యము, ఆవలింత, నిద్ర, తుమ్ము, ఉమ్మివేయుట, భయము, కోప్యాంగ స్పర్శనము, కోపము జప కాలములో విడువవలెను. **జపాత్ శ్రాన్తః ధ్యాయేత్, ధ్యానాత్ శ్రాన్తః జపేత్,** జప, ధ్యానయుక్తునకు మంత్రము సిద్ధించును. పురశ్చరణాంగముల ననుసరించి పురశ్చరణము చేయవలెను.

పురశ్చరణముకన్న వేరుగా నైమిత్తికమున్నది. ప్రత్యహము ఆచరించు పూజ నిత్యపూజ. శుద్ధనైమిత్తికపూజ 20 విధముల నున్నది. గురువు విచ్చేసినపుడు, సామయకులను దర్శించినపుడు, చంద్రసూర్యోపరాగములలో, మహోత్సవములో, తీర్థ, దైవతదర్శనమున, ఆపదలలో యథోచితముగా పూజ నాచరింపవలెను. ప్రాతర్మధ్యాహ్నములందు, ప్రదోషమునందు పూజ చేయవలెను. వర్షమధ్యములో పూజింపరాదు. **జప సమయములో పవిత్రము ధరింపవలెను.** పవిత్రనామ నాగమునకు శివుడు వరమిచ్చినాడు. పవిత్రారోపణములేక చేయుపూజ సఫలము కాదు. ఇట్లు నైమిత్తికము గ్రాహ్యము.

**కామ్యతంత్రము :** కామ్యకర్మ ఆరంభములో రోగ, కృత్యాది నాశకమగు శాన్తి నాచరింపవలెను. ఇందులో వశ్యవిధానమొకటి యున్నది. వశ్యకర్మ వసంతమున సిద్ధించును. స్తంభనము శిశిరమున నాచరింపవలెను. స్తంభనకర్మ నక్షత్రము లను కూలముగా నున్నపు డాచరింపవలెను. గ్రీష్మమందు విద్వేషణకర్మ నాచరింపవలెను. ఉచ్చాటనము వర్షాకాల మందాచరింపవలెను. మారణకర్మ శత్రువులకు ప్రాణహరణము. మారణములో విప్రులను చేర్చరాదు. లోకరక్షార్థమై ఆచరింపవలెను.

ప్రాయశ్చిత్తకర్మ దోషశాన్తికై ఉపయోగించును. ధనసిద్ధికరము, ఆయుష్కరము, అపమృత్యుజయకరము సర్వజ్ఞానసిద్ధికరము భయనాశకరము, పుష్టికరము, సౌఖ్యకరము మొదలగునవి అనేకములు కామ్యకర్మలు.

**కర్తవ్యము :** నిత్యము, నైమిత్తికము, కామ్యము అని తంత్ర లక్షణము నిరూపితమైనది, తంత్రవిశేషములు, సద్గురుసన్నిధిలో ఆగమములవలన తెలియగలరు. గురువునుండి తనకు తగినది గుర్తించి యథాశక్తి నిత్యము, నైమిత్తికము నాచరింపవలెను. పరహింసా హేతువులైన కామ్యకర్మలను మనస్సుచే కూడా స్మరింపరాదు. అభ్యుదయహేతువులైన సాత్త్వికములను అనుసరింపవలెను. రాజస, తామసములను స్మరింపరాదు.

**అశక్తకల్పము :** నిత్యకర్మకూడ నాచరించుటకు సామర్థ్యములేని సమయములో గుర్వాదులను స్మరించి, స్నాన, సంధ్యా, తర్పణముల నాచరించి, మాతృకాన్యాసము, మంత్రస్నానము, పంచోపచారపూజ, అష్టోత్తరజపము ఆచరింపతగును.

**ఉపసంహారము :** విద్యాభిలాషి దీక్షితుడై దేవతానుగ్రహమునకై యథావిధి తంత్రము ఆరంభింపవలెను. ఈ వర్ణించిన దంతయూ **శ్రీవిద్య**యొక్క అపరరూపము. ఈ అపరావిద్యకే అపరాదేవత నుపాసింపవలెను. పరదేవత లక్షితమగును. అపరా దేవతోపాసనము వల్ల సర్వాభీష్టసిద్ధి, జ్ఞానప్రాప్తి కల్గును. శ్రీచక్రదర్శనమున, తదుపాసనమున జ్ఞానప్రాప్తి కల్గును. బ్రహ్మ వేదనముదయించును. పరమకైవల్యము లభించును. సకలవేదవేదాన్తసారసంగ్రహభూతమైన "**బ్రహ్మవిదాప్నోతి పరమ్**" అను బ్రహ్మసూత్రము పరమప్రమాణము కావున పరమపురుషార్థసాధనము.

ఇతి నారాయణ స్మృతిః ।

**కల్యాణదేశికశిష్యోహం వినయానందమాధవః ।**
**కృతార్థోఽహం కృతీ ధన్యః తంత్రజ్యోత్స్నానుమోదకః ॥**

**శ్రీః**

**బ్రహ్మశ్రీ జమ్ములమడక మాధవరామశర్మ**





